శ్రీమతి వసుంధరాదేవి సావిత్రమ్మ గారికి.

అభినందనములతో

ఇట్లు,
వి. కృష్ణమాచార్య
21/7/52

# సు భ ద్ర

# సుభద్ర

★

ఎక్కిరాల కృష్ణమాచార్య
ఆంధ్రభాషోపన్యాసకుడు - హిందూకళాశాల
(గుంటూరు)

★

ఆయుర్వేదీయ రసాయన కుటి
బకింగ్‌హామ్‌పేట :: విజయవాడ-2

మూల్యము రూపాయి పావుల

# కృతిభర్తృ ప్రశంస

అపారే దుగ్ధాబ్ధౌ వలయజల డిండీరశకలా
న్యపాకుర్వాం స్తృష్ణాకులమివ ఖురాగ్రైశ్చల ముఖైః
అఖండ బ్రహ్మాండావృత తతమహాభాసిత తను
ర్హయాస్యో మాం పాతు స్థితిరచితశిల్పీ భువనపః

సహసాతీతాహస్కర కిరణ భృన్మండలముఖ
స్సముద్యచ్చిద్రూపో భవజలనిధౌ బాడబతనుః
దురీక్ష్య శ్శ్రీవక్ష శ్శశి రవి దృశాధారమూర్తిః
హయగ్రీవో దేవో మయి సదయ భావోఽవతు సదా

సమామ్నాతామ్నాయ స్ఫటికతర ధామ్నే హలహలో
న్మిషద్ధేషాఘోషా వహిముఖవిశేషాయ తనవే
సమస్తాఘౌఘాంత స్తిమిరహరయే నౌమిహరయే
భవార్తానాం బాధాహరణ పటుదీక్షాధిపతయే

గళే ముక్తాహారం మృదులకరయో ర్గ్రంథవలయౌ
ముఖే హేషాభూషా వళి రపి చ వక్షస్యనుపమా
తనౌ ప్రాలేయాంశో శ్శతశితరుచి ర్నిర్మలతరో
స్వభక్తత్రాణ శ్రీపిశున మవతా న్నయనయోః

నమ స్తే హంసాయ స్ఫటికతర విజ్ఞానతనవే
నమ స్తే హుంకార క్షపితహయ కంఠాయగురవే
నమ స్తే సర్గాదిస్థితి విలయ భృత్ శిల్పకృతయే
నమ స్తే శ్రీకాంతా కలితపృథులోరః పరివృతే

భక్తి ప్రివర్షాత్సలిల ప్రవాహః
హయాస్య శక్త్యా ప్రణిపత్య సద్యః
కవిత్వ బిం ద్వాక్షరరాశి రేతి
ముక్త్వాధ్వ మాయచ్ఛ్రుతి సంపదంచ

# పీఠిక

కేవల కల్పనాకథలు కృత్రిమరత్నములు; ఆద్య సత్కథలు పుట్టురత్నములు; అవారిత సత్కవి కల్పనా విభూషావహ పూర్వవృత్తములు సానలఁదీరిన జాతిరత్నములు; అను భట్టుమూర్తి వాక్యములు పురాధునాతన సమస్త భారతీయ వాఙ్మయ స్వరూప నిరూపణములు. వానిలో నాద్య సత్కథలు ఋషిప్రోక్తములు. అందు వ్యాసభగవానుల భారతము విశ్వవాఙ్మయమునకు మకుటాయమానము. సుప్రఖ్యాతమగు నందలి యితివృత్తమును గైకొని సామర్థ్యముకొలఁదిని గల్పనావిభూషావహ మొనరించి రచించిన దృశ్యకావ్య మీ సుభద్ర. ద్రౌపదీ ధర్మరాజు లేకాంతముననుండఁ బ్రమాదవశమున వారి యానందమున కాటంకపడిన యర్జునుఁడు తత్పాప పరిహారార్థమై నారదాదేశమునఁ దీర్థయాత్రలు బయలుదేఱును. ఆవస్తువునకు సంబంధించిన యొక మనోహరఘట్టమే నా యీ కావ్యమునకుఁ గథావస్తువైనది.

నెట్టినఁ బూలపాన్పుపైఁ బడె నన్న చందమున నున్నది యీ తీర్థయాత్ర యర్జునునకు. బహుతీర్థపర్యటనల శ్రమపడిన నేమి, పడతులు పరమ సౌందర్యనిలయలు మువ్వురు దక్కినారు; అందు సుభద్ర ముగ్ధ.

ఖాండవమునను, యంత్రమత్స్యమయమునఁ, బాంచాలములందును నర్జునుఁడు సవ్యసాచియై విజయము జేకొని విజయుఁడైనాఁడు, పిమ్మట నతని జీవితమున నీ తీర్థయాత్ర

ప్రముఖసన్నివేశము. ఇందును నతఁడు విశేషములగు ప్రణయ విజయములను బొందుటచే విజయుఁడైనాఁడు. ఈ విజయముల తుదఁ జేకూరిన భద్రమే సుభద్ర.

బ్రహ్మచర్యమున సాధ్యమగు యోగము గార్హస్థ్యమున సంపూర్ణతనొందు ననుట సుప్రసిద్ధ వైదిక మార్గము. శ్రీవాణీగిరిజలఁ జిరముగ వక్షోముఖాంగముల ధరించిన వేదత్రయమూర్తు లగు త్రిపురుషు లీ స్త్రీపుంసయోగ మునకు యోగీశ్వరులుగా దర్శింపఁబడినారు. ఈ యోగ మార్గము భారతామ్నాయమున నెల్లెడల స్పందించును. అదియే సుభద్రా పరిణయఘట్టమునఁగూడ నెలకొనిన పవిత్రభావము. యోగిరూపమున వచ్చిన యర్జునుఁడు సుభద్రాప్రాప్తితో రాజ యోగి యైనాఁడు. ఉమాయుక్తుఁడగు గౌరీశునివలెను, రమా యుక్తుడగు శ్రియఃపతివలెను, వాణీయుక్తుఁడగు వాగీశునివలెను అర్జునుఁడు స్త్రీపుంసయోగమునంది యుత్తమ ఫలమనుభవించి నాఁడు. అటుపిమ్మట నర్జునుని జీవితమంతయు నొక రాజయోగ సాధనము. నా సుభద్ర నాటకమున నీ రాజయోగ పూర్వ రంగ చారుచరిత్రము జిత్రింప యత్నించితిని. సుభద్రార్జున శబ్దార్థ వివేచనమునను నీయపహరణకథావస్తు రచనయందును మహర్షి వ్యాస భట్టారకు లిట్టి గూఢార్థము సంకల్పించినట్లు వ్యక్తమగుచున్నది. లేకున్న ధర్మనిబద్ధబుద్ధియగు నామహర్షి యుత్తమకులసంజాతులగు నీ వ్యక్తుల నపహరణకథకుఁ బాత్ర లుగా స్వీకరింతురా? అపహరణనే యుద్వాహమనియు, వివాహ మనియుఁగూడ నందురు. పూర్వోక్తమగు రాజయోగమును ధ్వనిప్రధానముగ నాటకమునఁ గీర్తించితిని.

రూపకసౌష్టవమును, రసస్ఫూర్తిని నుద్దేశించి భారత కథయందుఁగాని, విజయవిలాసమునఁగాని కన్పింపని నూత్న కల్పనల సృజించితిని. అందొకటి చిత్రపట సన్నివేశము. కన్నియ కలుగు ప్రేమ వినుకలి కనుకలులలో నొకటియై యుండును. సుభద్ర వ్యక్తమైన పిమ్మట నర్జునునిమూర్తి వివినది కాని వినుకలి గలుగలేదు. కనుకలికవకాశము లేదు. ఈ చిత్రపట సన్నివేశమువలన ముందుఁ గనుకలికిని, పిమ్మట వినుకలికిని రెంటికిని వీలుకలుగునను నూహతోఁ గల్పితమైనదే యీ చిత్రపట సన్నివేశము.

రెండవదైన నాట్యప్రయోజనము నిట్టిదే. చిత్రపట సందర్శనమున సుభద్రకు మనస్సంగమము కలిగినది. వంజుళ పాడిన నాట్యగీతమువలన నూతనోదయానురాగమునకుఁ దొలిక దుర్యోధనునకు బలరాముఁడు తన్నిచ్చుట యను నప్రస్తుతి తోఁచినది. ఆ గీతమున వ్యంగ్య గర్భితముగఁ దత్ఫలితము లేమో స్ఫురించినవి. క్షణకాలముల నామె యుగ యుగమ్ముల వియోగ మనుభవించినది. ఇది పూర్వరాగ విప్రలంభము.

కాశ్యపుని పాత్రయందు సంస్కృత నాటకములలోఁ గనుపించు విదూషక నర్మసచివుల యుభయ లక్షణములుఁ బ్రవేశితము లైనవి. తుద కీతనిమూలమున నాటక నిర్వహణము జరిగినది. వంజుళ మూలమున సూచ్య కథావస్తువు పతితమైనది. మందారికా వకుళలు సామాన్య పరిచారికలు. వీరు తమలోఁ దాము సంభాషించుకొనునపుడు ప్రాకృతుల

భాషయు, నుత్తమ పాత్రలతో వ్యవహరించునపు డుదాత్త భాషయు వాడుట యుచిత మని నేను భావించితిని.

ఈ నాటక రచనావిధానమునఁ బరిమిత సంఖ్యగల పాత్రల నెన్నుకొనుటయందును, స్థాపనాదికము లందును సంభాషణాక్లుప్తియందును భాసమహాకవి మార్గము ననుసరించితిని.

ఈ నా ప్రథమ ప్రయత్నమును సహృదయతతో రసికలోకము నన్నాశీర్వదించుఁ గాక!

నా శ్రేయస్సునుగోరి యిట్టి రచనకు నన్ను బురికొల్పిన గురుదేవులకు, మిత్రులకు నేను సర్వదా వినతుఁడను; కృతజ్ఞుఁడను.

హిందూకళాశాల,
గుంటూరు.

ఎక్కిరాల కృష్ణమాచార్య,
ఆంధ్రభాషోపన్యాసకుఁడు.

# సుభద్ర

## [నాంది]

రాగద్వేషములన్ జయించు నపు డాఁపంబంది వారాంనిధిన్
యోగాభ్యాస నిమీలితాక్షియుగ మాయోపాయ దంభంబునన్
క్రీఁగంటన్ ధరణిం గనుంగొని వెసన్ శ్రీదేవి లాలించుచున్
భోగారూఢి నరార్చనల్ గొనెడు నా పుంమూర్తి మిమ్మేలుతన్.

(ప్రవేశము - నాంద్యంతమున సూత్రధారుఁడు)

సూత్ర:—ఏమి యాలస్యము? మహాపారిషదులను నిరీక్షింపఁజేయుటయా!

(ప్రవేశము - పారిపార్శ్వకుఁడు)

పారి:—బావగారి యాజ్ఞకోసమే వేచియున్నాను.

సూత్ర:—బావగారి యాజ్ఞయనఁగా జ్ఞప్తికివచ్చినది. శ్రీకృష్ణుని నాటకమగు "సుభద్ర"ను నేఁడు నటించవలసినదిగా నార్యమిశ్రులయాజ్ఞ. నీవు సంగీతకము రంగమంగళముగాఁ బ్రవర్తింపఁజేయుము. ఇంతలో రంగప్రసాధనముగూడ నవసితమగును.

పారి :—మంచిది. ఈ క్రమ్ముకొనివచ్చుచున్న శారదాడంబర మునుగూర్చియే గానముచేయఁదలఁచుకొంటిని.

అల మత్స్యధ్వజమెత్తి పంచశరవిన్యాసంబునన్ లోకముల్
గెలువ న్నేర్చిన మేటిజోదు తరలె న్గ్రీడింపఁగాఁ గాత్రికో
జ్జ్వల చంద్రాతప హారికాంతి దెసలంబర్వెత్తు కీర్తిస్ఫుర
త్కళికాసంతతి తోరణంబులుగ దిక్కాలంబుల న్నిండుచున్.

(నిష్క్రమించును)

సూత్ర :—ఏడీ! ఏమైనాఁడీ మారిషుఁడు?

(నేపథ్యమునుండి)

ఏడీ! ఏమైనాఁడీ యర్జునుఁడు!

సూత్ర :—ఓహో! ఏమి యీ పాత్రల యానందాతిశయము! నేను నీ కాశ్యపునివలెనే నా మిత్రునికై వేచియుండెదను.

(నిష్క్రమణ)

# ప్రథమాంకము

(గంగాతీరము - ప్రవేశము : కాశ్యపుఁడు)

కాశ్య :— ఎందేగినాఁ డీయర్జునుఁడు! నాప్రాణములు విసిగిపోవు చున్నవి. ఈయనతోఁ దీర్ఘయాత్ర యెఱుఁగకపోయి బయలు దేరితిని. ప్రతిదినమును నా కనుమొఱఁగి యెటో పోవును. మఱలఁ గాన్పించఁడు. అర్జునా! ఇంతటిలో నేమైనావు! గంగాకూలమునకు నాతోనేవచ్చితివి. ఇద్దఱము ఘట్టమున నడుములోతు నీటిలోదిగితిమి. అయ్యో! నాతోనే రెండు మారులు మునిఁగి లేచినాఁడు. మూఁడవసారి యిఁక గాను పించలేదు. ఏమైనట్లు! ఏవైన ఘోరనక్రములు కాటియ నెట్టె ననుకొందమా! మాయర్జునుఁ డట్టి యలుపములకు గురియగు వాఁడుగాఁడు. వంద మొసళ్లనైన నవలీలఁ జీల్చి యావలఁ బారవేయఁగలఁడు. అమ్మా! భాగీరథీ! నాకేమని తల పోయుటకును మనసొప్పకున్నది. ఇరువురముగలసి యింద్ర ప్రస్థమున బయలుదేరుచో నాతని నర్మసఖుఁడగుటయే నా యదృష్టమని యెంతయు నుప్పొంగిన నే నిప్పు డింద్రప్రస్థ మే మొగముతోఁ జూడఁగలను! (ఆలోచించి) నాగలోక వాసు లెవరైన తమ రాచకార్యములఁ జక్కఁబెట్టుటకీయ నను గొనిపోయి రేమో! ఏమైననుసరియే! ఇఁక జాగు సేయక నన్నును, నావిజయునికడకుఁ గొనిపొమ్ము. ఇదే వచ్చు చున్నాను. (గంగలో దుముక నుద్యుక్తుఁడగును)

(ప్రవేశము - అర్జునుఁడు)

అర్జు :— (స్వగతము) నాప్రియసఖుఁడు కాశ్యపుఁడు నాకై యెదురుచూచుచు దిగులుపడి యున్నట్లున్నాఁడు. (చూచి సత్వరముగ) మిత్రమా! కాశ్యపా! (సమీపించి భుజమునఁ జేయిడి) ఏమిది! స్నానమాడెదవా? లేక మునుకఁ బోవుచున్నావా?

కాశ్య :—(వెనుదిరిగిచూచి హర్షాశ్చర్యములతో) విజయా! ఇంతతడవు నీకాశ్యపునివిడచి యెట కేగితివయ్యా? ఎంత వెదకినను గానరావు. ఇప్పుడెటనుండి రాఁగలిగితివి? ఇంత వఱకును గంగామధ్యముననే నిలిచితివా?

అర్జు :—కాదు. నాగలోకమున - చెప్పెదను రమ్ము.

కాశ్య :—అబ్బ! ముందు నామనస్సు స్థిమితపడనిమ్ము.

(హృదయమును సవరించుకొనును)

అర్జు :—(కొంచె మూగి) ఇఁకరమ్ము పోదము.

(ఇరువురును బరిక్రమింతురు)

అర్జు :—ఆహా! ఏమిచిత్రము!

అల మిన్నేటి తరంగపంక్తిపయి నుద్యద్రూప లావణ్య దో
హాలయానొక్క-ఫణీంద్రకన్య తనయొయ్యారంబుతోఁ గన్నులన్
వెలుఁగన్ జేసి నిజోపగూహ విభవావేశ మ్మనుం బ్రేమమై
నలవోక న్గొనిపోయి నిల్పె నురగేంద్రావాస సౌధంబునన్.

ఆమెపేరు ఉలూపి యఁట; నన్ను వరించి తనలోకమునకుఁ గొనిపోయి యొక దివ్యభవనమున నిలుపుకొన్నది.

కాశ్య :—గంగాస్నానఫలము! తరువాత నేమిజరిగినది?

అర్జు :—ఏమని చెప్పఁగలను?

సురగరుడేంద్ర కిన్నరులు చూడఁగ నేరసి యందచందముల్
గరువపురేఖఁ గుల్కుకన్నులకన్నియ వేడ్కతోడ నా
సరసపు నేలఁ గోరె నొక చక్కనిపుత్త్రుని నన్మదీయ సు
స్థిరతర రూపరేఖలును ధీరతయుఁ బల మొప్పువానినిన్.

కాశ్య :—అట్లే చేసియుందువు.

అర్జు :—అవును! అటుపైన గొలఁదికాలము మాత్రమె యట గడపి వెంటనే బయలుదేరి వచ్చితిని.

కాశ్య:— ఇంతకాలము నే నెట్లు గడపితినో యీ గంగాదేవికే యెఱుక.

అర్జు :—కాశ్యపా! నే నెఱుఁగనా! అందులకే సత్వరముగ వచ్చితిని.

కాశ్య :—మన తీర్థయాత్ర సలక్షణముగనే జరుగుచున్నది. ఈ యొక మాసము నీవు నా మనసు కలవరపెట్టకుము.

అర్జు :—ఇటుపైన నిన్ను విడచిపోనులే. మన మిఁక బయలుదేరుదమా?

కాశ్య :—ఎచ్చటికిఁ బోవుదము!

అర్జు :—నీ యిష్టము.

కాశ్య :—అంతయు నాయిష్టమే! కాని నీవు మాత్రము నన్నంటి పెట్టుకొని యుండవు.

అర్జు :—ద్వారకకుఁ బోవుదమా! ఆ పుణ్యక్షేత్ర దర్శనమే మిగిలినది.

కాశ్య :—అచట నొక క్షేత్రము కాదు. రెండు క్షేత్రములు.

అర్జు:—రెండనఁగా?

కాశ్య:—ఒకటి క్షేత్రము. రెండవది శ్రీకృష్ణదేవుఁడు.

అర్జు :—అందువల్లనే యచ్చటకుఁ బోద మని చెప్పితిని.

కాశ్య :—అటకుఁ బోయిన తరువాత క్షేత్ర ప్రాధాన్యమా! శ్రీకృష్ణ ప్రాధాన్యమా!

అర్జు :—నా కేమియు నర్థమగుట లేదు. మన తీర్థయాత్ర ఫలవంతము గావలెను. స్వామి యున్నాఁడు గనుక క్షేత్రము.

కాశ్య :—అవును. నిజమే! కాని యిప్పుడు పోవునది మేనమామల యిండ్లకుఁగదా! ఇదియును దీర్థయాత్ర యెట్లగును!

అర్జు:— కాశ్యపా! భయము లేదు!

కాశ్య:—నా కేమి భయము! నీ కుండవలయును.

అర్జు:— ఎందుకు!

కాశ్య :—భగవంతునియందు భయ భక్తులతో మెలంగ వలయును గనుక.

అర్జు :—కాశ్యపా! శ్రీకృష్ణునియందు నాకు భక్తియేగాని భయము లేదు.

కాశ్య :—బలదేవుం డన్నచో భయ మక్కఱలేదా!

అర్జు:—నీ మనస్సున నేదో యొకభావము దాగియున్నట్లు నీ మాటలవలన గ్రహించుచున్నాను.

కాశ్య :—నా మాటలలో నే మున్నది?

అర్జు:—ఏ మున్నదో నాకుం దెలియదు. కాని

తొల్లి గోవర్ధనం బెత్తి యెల్ల గోకు
లమును గృష్ణుండు రక్షించు సమయమాది
ద్వారకా పురమ్మున శరద్రాత్రులందు
నుత్సవంబులు సేయుచు నుందు రేంట.

ఇది శరన్మాసము. నానా దేశములనుండియు రాజర్షి, బ్రహ్మర్షి వర్యు లాహూతులై వచ్చి యుత్సవంబులు దర్శించి తరింతురు. అట్టిచో మన మీ సమయమున నితర క్షేత్రములు దర్శించుటయేల? రమ్ము. మనము నచటికే పోవుదము.

కాశ్య:—(నిలంబడి) మేనమామల యిండ్లవసతియుం దీర్ఘయాత్రా వ్రతమును జతగూడునా?

అర్జు:— అవును నిజమే. అట్లయినచో నే నొక రాజర్షి వేషమున నచటఁ గాలము గడపెదను. సరియా?

కాశ్య:— మఱి నేను?

అర్జు:— నీవు నొక బైరాగివికమ్ము.

కాశ్య:— నే నిదివఱకే బైరాగి నైతిని.

అర్జు:— సరే! రా!

(పరిక్రమింతురు)

కాశ్య:— (పరిక్రమించి - మఱలనిలఁబడి) నీవు నిజముగాఁ దీర్ఘ యాత్రకే బయలు దేరుచుంటివా?

అర్జు:— యతివేషముననే వత్తు నంటినిగదా! నీ కెందుల కా యనుమానము?

కాశ్య:— (పరిక్రమించి నిలఁబడి) నీవు నిజముగాఁ దీర్ఘయాత్రకుఁ బోవుట లేదు.

అర్జు:— నిజముగాఁ బోవనప్పు డనుకొను టెందులకు?

కాశ్య:— అట్లు కాదు. ఒకవేళ పోవుచుంటిమే యనుకొనుము.

అర్జు:— నే ననుకొనుట లేదు.

కాశ్య:— నేను చెప్పుచుంటినిగా! అనుకొనుము.

అర్జు:— ఆఁ! అనుకొనుచుంటిని.

కాశ్య :— అర్జునచో నీ వనుకొనుచున్న కార్యము చాల దుస్తరము.

అర్జు :—ఏ కార్యము?

కాశ్య:—'శ్రేయాంసి బహు విఘ్నాని'. బల దేవులామెను దుర్యోధనున కిచ్చుటకు నిశ్చయించినారు.

అర్జు :—ఆమె నవంగా?

(స్వగతము)

కుటిలతర తంత్రి కర్కశ
చటులత లలవడిన యతని సరసనుగొన నీ
కుటిలాలక యొప్పుటయవం
దటిదంగన పిడుగులందుం దగనిలచుటయే!

(ప్రకాశము) ఈ విషయము నీ కెట్లు తెలిసినది?

కాశ్య:—ఆ దినమున నారదులవారు చెప్పిరికదా! నీవును విని నావు! నాకు జ్ఞప్తి యున్నది.

అర్జు :—నా కది యప్పుడే మఱపునకు వచ్చినది.

కాశ్య :—అది యతికి సహజమే గదా! అందువలననే యది కష్ట మంటిని. బలరాముని యెఱుకలేకుండ నా క్షేత్రలాభము కష్టతరము.

అర్జు:—మన కా యుద్దేశ్యము లేనప్పు డింత విచార మేల?

కార్శ్య:—అయినను నీ వచ్చుట యతిరూపమున నుండుట యందు లకుఁగూడ ననుకూలించు నని చెప్పుచుంటిని.

అర్జు:— అనుకూలించదు, మన కేమి?

కార్శ్య :—యతి వేషము ధరింతునన్నంతటనే యింత వైరాగ్యము వచ్చినదే! యతి వైనతరువాత నాతోనే మాటాడవు.

అర్జు :—ఓయీ! ఆ సుభద్రను నేను చిన్ననాఁడెప్పుడో యెఱుఁగుదును. ఆమెకు మనము జ్ఞాపకమా?

కార్శ్య:—నీ వీర కార్యములు దిక్కులందు మ్రోఁగుచున్నవి. ఆమె నిన్ను వినుచునేయుండును.

అర్జు:— వినవచ్చును. చూడ లేదుకదా!

కార్శ్య:— అదియెంతపని. నే నొక చిత్రకారుని వేషము ధరించి చిత్రముల నమ్ముచు నీ చిత్రమును సుభద్ర కందఁజేయు దును. చిత్రకారులకు రాజదర్శనము సుకరము గనుకఁ బురములోని కేకాదు, అంతఃపురములోనికిఁగూడఁబోఁగలను.

అర్జు:— ఇఁకనైన బయలు దేరుదము. చాలదవ్వుపోవలెను. విలంబన మగుచున్నది.

కార్శ్య:—అవును. నీ వింక విలంబనము సహింపలేవు. అచటికిఁ జేరకమునుపు మార్గమధ్యముననే నిన్నుఁ జిత్రింతును.

అర్జు:—ప్రమాదముసుమా! తీర్థయాత్రా దీక్షితుఁడనగు నీ నా రూపమును మాత్రమే చిత్రింపుము. లేనిచో మనము యతి వేషము ధరించిన లాభ మేమి!

కాశ్య:—అవునవును. మందబుద్ధిని మఱచిపోతిని. ఇప్పుడు నిన్నె వరును గుఱుతింపకుండుటకుఁగదా యీ వేషధారణ! అందు వలనఁ జిత్రముగూడ నిన్ను గుర్తించునటు లుండఁగూడదు. లేనిచో నంతిపురమువారు పసికట్టుదురు.

అర్జు:— అప్పుడును గృష్ణబలదేవులు గుర్తింపఁ గల్గుదురు.

కాశ్య:—నీ వొకవేళ సుభద్రను రహస్యముగాఁ బరిణయ మాడ దలఁచినచో శ్రీకృష్ణుఁడు నీకుఁ దోడగునా! లేక యతనిని గూడఁ గనుగప్పవలెనా!

అర్జు:—నీవు కావలె నని విలంబనము సేయుచున్నావు. ఇఁక సహింపను. బయలుదేరుము. నీవు రానిచో నేనే పోయి వచ్చెదను.

కాశ్య:—కష్టముసుమా! వన్ని సమయమున విడువవలదు. ఇదిగో, నేనును వచ్చుచున్నాను. మన యిప్పటి మార్గమెట్లు!

అర్జు:—

అదె త్రిమార్గగ హరిపదాభ్యంతరమ్ము
ద్వారకకు ద్వార మాచును దారిమల్లఁచు
నట్టిపావన వర్త్మంబు నంటిచనిన
మనసుభద్రమా క్షేత్రమ్ము గనగవచ్చు

# ద్వితీయాంకము

( చంద్రశాల - ప్రవేశము: సుభద్ర, మందారిక )

సుభ :—(కమలమునుఁ జేతఁగొని దళములు స్పృశించుచు నేదియో యోచించుచుండును)

మందా :—ఏ మమ్మా! సుభద్రా! ఏమో యన్యమనస్కవలె నున్నావు?

సుభ :—మందారికా! అళివరుని స్పర్శవలనఁ గమలదళముల కొక క్రొత్త యందము వచ్చునుసుమా!

మందా :—అందుకనియే బలదేవులు నీకు వివాహ ప్రయత్నము చేయుచున్నారు.

సుభ :—ఏమే యీ మాటలు! ఇఁకఁ జాలింపుము.

(సిగ్గునఁ దలవంచును)

మందా:—నీ కిష్టములేని మాట కాదుగదా నేనన్నది? కురుయువరాజు నిజముగా రసికుఁడని యెందఱుచెప్పఁగా వినలేదు?

సుభ :—ఆయన రసికుఁడో, కాదో మన కెందుకు?

మందా:— మఱి రసికుఁ డెవ్వఁడు కావలయును!

(ప్రవేశము : చేతఁ జిత్రిపట మూని వకుళ)

వకు :—(ద్వారముకడ నిలచి) అమ్మా —

సుభ:— (తిరిగిచూచి) వకుళా! అక్కడనే నిలచితి వేమి!

మందా :—లోనికి రావచ్చునుగదా'

( వకుళ లోనికి వచ్చును )

మందా:—ఎక్కడనుండి వచ్చుచుంటివి!

వకుళ :—అమ్మా! సుభద్ర! రుక్మిణీదేవివారు సంగీతగోష్ఠికై మిమ్ములను రమ్మని పిలువనంపగా నిటువచ్చితిని. మీరు త్వరగా సిద్ధమై బయలుదేరవలెను. ఆరంభించు వేళయైనది. ఈ దినమున వంజుళ నాట్యముచేయును.

మందా :—నీ విప్పుడు రుక్మిణీదేవియొద్దనుండి వచ్చుటలేదుగదా! ఎటనుండియో వచ్చుచు నామె పిలచిన దనెద వేమే!

వకుళ :—ఆమె నన్నీవిషయ మిదివఱకే తెలుపమన్నది. నేనే మహారాజులవారు శ్రీకృష్ణులమందిరమునకుఁ బోవుచు బర ధ్యానమున మఱచితిని. ఇప్పు డచ్చటనుండియే వచ్చు చున్నాను.

మందా :—ఆ చేతిలోని దేమి!

వకు :—ఇవి చిత్రపటములు. ఇంద్రప్రస్థమునుండి యెవరో చిత్రకారులు వచ్చిరి. వారు సృష్టించిన యీ చిత్రములను భగవానులు గైకొని వారికిఁ దగు పారితోషిక మిచ్చిపంపి వెంటనే యటనున్న నాచేతి కిచ్చి రుక్మిణీదేవి కందఁజేయు మనినారు. కొనిపోవుచుంటిని.

మందా :—ఏవీ చూతము.

వకు :—(తెరచి చూపించుచు) ఇది యెవరిచిత్రమో! ఆహా! ఏమీ యతిలోక సౌందర్యము!

మందా :—ఏది యేది! (వకుళప్రక్క కేఁగి నిలచి చూచును) ఓహో ఏమి వక్షస్స్థలము! ఆ నవనవలాడు శరీరకాంతి చూడవే!

సుభ :—ఎవరిదే ఆ చిత్రము!

వకు :—అమ్మా! పెండ్లియీడువచ్చిన కన్యవు! పరపురుషుల చిత్రములు చూడవచ్చునా! (గోపనముచేయును)

సుభ:—ఆచిత్ర మెవ్వరిదో యతి దంటివికదా! చూడవచ్చును.

వకు :—(అందిచ్చును)

సుభ :—(పరికించి) ఇంత చిన్నవయసు. ఇంతటి సౌందర్యము. ఈయన యతి యేల కావలసివచ్చెనో!

వసు :—ఎవతెయో తాను ప్రేమించిన స్త్రీ లభించియుండదు. అందుచేత ననుకొందును.

సుభ :—యతియైనచో లభించునా!

వసు :—ఆ సౌందర్యవతి జాలిపొంది యంగీకరింపవచ్చు నని కాఁబోలు.

సుభ :—నిజముగాఁ దనకొఱకట్లయినచో నింత యందగాని నెవ్వతెయైన నంగీకరించును.

మందా :—ఈయన చాలపరాక్రమవంతునివలెఁగూడ నున్నాడు.

వసు :—చిత్రములుచూచి బలాబలములు తేల్పఁగలజాణవే నీవు!

మందా:—నన్నంత తీసివేయకు. ఈయన యెవరో పట్టమహిషికిఁ దెలిసియేయుండును. ఇంకను గావలెనన్నచో రుక్మిణీదేవిగారి నడుగుదము. ఈచిత్తరువు భగవానులు పైనపెట్టియుంచుటలోఁగూడ నాయర్థము స్థిరపడుచున్నది.

వసు :—ఇటుపైని జరుగు వరపరీక్షలకు నిన్నే నియమింపుమని దేవిగారికిఁ జెప్పెదనులెమ్ము. (సుభద్రతో) అమ్మా! చిత్తరువు నిత్తువా? పోయిరావలెను.

సుభ :—నాట్యమున కట్లును వచ్చుచునేయుంటిమిగదా! నేనే కొనివచ్చెదనులెమ్ము.

వకు :—అయినచో మిగిలినవిగూడ నిటనుంచిపోయెదను; తమరు చూచి తెప్పించవచ్చును.

మందా :—ఆ! నాచేత మోయించుటకా! వలదులే నీవే కొని పొమ్ము.

వకు :—(మిగిలిన చిత్రములు గ్రహించి) అమ్మా వెంటనే బయలుదేరిరావలెను. పోయివత్తును.

సుభ :—మంచిది.

(వకుళి నిష్క్రమించును)

సుభ :—(చిత్రము పరికించుచు ననుమానముతో) ఈ మహానీయు డిట్లు యతిరూపమున జిత్రింపబడుటకు గారణము! ఈయన నిజముగా యతియే యందువా!

మందా :—ఒకవేళ ప్రస్తుతమాయన తీర్థయాత్రాదీక్షలో నుండవచ్చును.

సుభ :—(నిట్టూర్చి) చిత్రకారు లెంతధన్యజీవులే! (చిత్రమును వీధికపై నిలుపును.) మందారికా! అనుభావసౌందర్యమునకును, రాజభోగములకు నెంతయంతరమే!

మందా :—అవును. దీక్షావేషముననున్న యీ మహానుభావుల చిత్రపటమునుండియే బ్రహ్మతేజము క్షాత్రతేజముతో బాటుట్టిపడుచున్నది.

(దూరమునుండి సంగీతము వినఁబడును)

మందా :—అమ్మా ! గోష్ఠి యారంభమైనట్లున్నది. మన మిఁకఁ బోవలెను.

సుభ :—అవును. బయలుదేరుదము.

మందా :—అమ్మా ! యిటు - యిటు.

(ఇరువురును బరిక్రమింతురు)

మందా :—ఇదే రుక్మిణీదేవి కేళీమందిరము. రమ్మా. ప్రవేశింతము.

(ఇరువురును బ్రవేశింతురు. లోపల రుక్మిణి, వకుళ, వంజుళ ప్రవేశము)

రుక్మి :—అమ్మా సుభద్రా ! వచ్చితివా ! నీకొరకే యెదురు చూచుచుంటిమి. రమ్మా.

(అందఱును గూర్చుందురు)

రుక్మి :—(వంజుళతో) ఆఁ! అటుపైన నేమిజరిగినది !

వంజు :—ఆయన తీర్థయాత్రలు చేయుచున్నాఁడుగనుక నచటఁ గానుపించిన యెదుకొలఁకులలో స్నానమాడుట కుద్యుక్తుఁ డయ్యెనఁట. అచటివారందఱు వారించుచున్నను, వినక యొక్కకొలనున నవగాహన మొనరించెనఁట. స్నానము చేయునంతలో నొక మహాగ్రాహ మాయనను బట్టుకొనినది.

సుభ :—ఎవరినే !

వంజు :—ఆ యర్జునమహారాజునే !

సుభ :—(చకితయై) ఆయన తీర్థయాత్రలఁ జేయుచున్నాఁడా ?

(రుక్మిణి చిరునగవున సుభద్రమోము చూచును; సుభద్ర సిగ్గున దలవంచును)

వంజు :—అప్పుడాయన యా నక్రము నవలీలగా నీటినుండి వెడలించి యీవలకు విసరఁగా నది వెంటనే యొక యప్సరోరూపమంది తనకు శాపవిముక్తియైనందులకు విజయుని బ్రశంసించినది.

సుభ :—(హర్ష పులకితయై తనలో) ఏమి మహానుభావము !

వంజు :—అట్లే మిగిలిన నాలుఁగు హ్రదములలో నవతరించి మఱినాలుఁగు నక్రములను దివ్యాంగనలుగాఁ జేసినాఁడఁట.

రుక్మి :—ఇది నీ కెట్లు తెలిసినది ?

వంజు :—మాండవ్యులవలన.

మంత్ర :—చెప్పమఱచితిని. మనల నీ సాయంసమయమున నుత్సవారంభమునకుఁ బూర్వమే ప్రభాసద్వీపము చేరవలసినదిగా మహారాజులు మాండవ్యులచేఁ గబురంపినారు.

వకు :—భగవానులు నాతో స్వయముగనే చెప్పినారు.

రుక్మి :—సుభద్రా ! ఏమి యీనాఁడిట్లు మౌనముగానున్నావు ?

సుభ :—ఏమియు లేదు.

రుక్మి :—ఆచిత్రపటమును దీసికొంటివటగా ? ఏది యాచిత్రము ?

సుభ :—సంగీతగోష్ఠికని వచ్చుత్వరలో మఱచిపోతిని.

రుక్మి :—అది నీకడ నుండరాదు. నీవు చిన్నదానవు. శ్రీఘ్రమాపో వివాహము కాఁబోవుచున్నది. ఇఁక చిత్రపటములతోఁ బని యేమి ? అదిగాక నీవు కురుయువరాజు గృహమున కేఁగు నపుడది యసలే నీకడ నుండరాదు. వారికిని, వీరికిని గల మనోవైషమ్యములు మన మెఱుఁగనివి కావు.

వకు :—వారుసరే. వీ రెవరు ?

రుక్మి :—సుభద్రా! వంజుళ నాట్యము చేయును. నేఁడు నీవు వీణ వాయింపుము. (వకుళ లోనికేఁబోయి వీణదెచ్చి సుభద్ర కిచ్చును)

వంజు :—(అభినయముగ)

కొలనిలోఁ దమ్మినై మొలచు టే యేల
నలుదిక్కు-పరువమ్ము వెలయించి తేల
మెలమెల్లఁ జిఱుగాలి పిలుపులోపలనె
యళికుమారుని నెన్న కలరించు టేల
కలరవము మధుధార గొలికించి మించి
యులికిపడ నేల నీ యుదయచాలనల

సుభ :—(వీణెమీటుట నాపి వివశయైచూచుచు స్వగతము) ఏల యీగానమునానామనస్సుకలవరపడుచున్నది? (నిట్టూర్చును. రుక్మిణి, మందారిక పరికింతురు.)

వంజు:—

తొలిజన్మ నోములఫలము లేమాయెం
బులకించి ప్రియునికై కులుకు టిది యెంత
కలువ రారాజుల కలిమిలో నీకు
విలువ లే దిటుపైన వేగపడరాదె

సుభ :—(మూర్ఛపోవును)

రుక్మి :—అమ్మా ! ఏమిది ? (చేలాంచలమున వీచును)

సుభ:—(తేరుకొని) నామనస్సేలో కలవరపడినది. ఇంక నీగానము వినఁజాలకున్నాను.

రుక్మి :—వంజులా! ఈనాఁటి క్రీడ గోష్ఠి చాలింతము.

(పరిచారికలందఱు నిష్క్రమింతురు)

రుక్మి :—చిట్టిమఱదలా ! ఆ చిత్ర మెవ్వారిదే ?

సుభ :—వదినెగారూ ! చిన్ననాఁటిపోలికలు చూచి సందేహ పడితిని. మీ రన్నమాటతో ధ్రువపడినది.

రుక్మి :—దానికిని, నీవు మూర్ఛపోవుటకును సంబంధ మేమి ?

సుభ :—(లజ్జపడును)

రుక్మి :—మఱదలా! బావగారు నీ లజ్జావాహిని కానకట్ట కట్టుచున్నారు.

సుభ :—(నిట్టూర్చును)

రుక్మి :—అమ్మా! భయము లేదు. మీ పెద్దన్నగారు కాలువ నట్టుత్రవ్వుద మనుకొనుచుండఁగాఁ జిన్నన్నగారు కాలువ నిటు త్రవ్వుచున్నారు. నీ పంటయే పండును.

సుభ :—వదినెగారూ! యతివేష మెందుకమ్మా?

రుక్మి :—నీకోసమే. మఱియు మీపెద్దన్నగారికోసము ఆ దీక్షా స్వరూపమే యది. కాని దానిగాథ యగాధము. మీ చిన్నన్నగారి హృదయమునకే తెలియును.

---

# తృతీయాంకము

( ప్రవేశము - కృష్ణబలరాములు, సేవకుడు )

బల :—సేవకా! ఎవరో రాజర్షి వచ్చి పటకుటీరముల వేచి యుండె నంటివి? అటకు మార్గము చూపుము.

సేవ :—చిత్తము. దయచేయుడు.

బల :—కృష్ణా! రమ్ము, నూతనాభ్యాగతులను దర్శించుకొని వత్తము.

సేవ :—దేవా! ఇటు ఇటు.

(అందఱును పరిక్రమింతురు)

సేవ :—(పటకుటీరము నిర్దేశించి) ఇందే వారున్నారు.

(కృష్ణబలరాములు ప్రవేశింతురు. లోపల యతివేషమున నర్జునుడు ప్రవేశము. సేవకుడు నిష్క్రమించును.)

బల :—రాజర్షులకివే మా యభివాదనములు.

అర్జు :—'ఓం, నమో నారాయణాయ'.

బల :—కృష్ణా! ఇంత యెలప్రాయముననే జితేంద్రియత్వము నకై వేడుకపడిన రాజర్షులను నమస్కరింపుము.

అర్జు :— యోగీశ్వరేశ్వరులు, దైవాంశసంభూతులు నైన
మీకే నా నమస్సులు. (నమస్కరించును)

అకలుష యజ్ఞపూత పరమాయువులైన ఋషీంద్రబృందముల్
సకల తపఃప్రపంచ పరసాధక వేత్తలు కర్మయోగ సా
ధకులును నిష్ఠమై నెవరిధామము నించుకఁ గాంచఁగల్గి రా
యొకమహనీయు నిర్వ్యరము యుద్భవమందిన నీకు మ్రొక్కెదన్.

శ్రీకృ :—స్వామీ! ఇది సముదాచారము కాదు. (కొంచెమాగి)
యాదవకృష్ణుఁడార్యుల సుగృహీత నామధేయము వినఁ
గుతూహలుఁడు.

అర్జు :—ఎన్నినామములతోఁ బిలచినను వస్తు వొక[illegible]కదా!

శ్రీకృ :—మహర్షుల ధర్మసూక్ష్మములు సందేహనిర్మూలనములు.
మా కిరీటి కొక్కనికే పది నామములుండుటయే దీనికిఁ
బ్రత్యక్షప్రమాణము.

అర్జు :—శరీరమాత్ర పర్యవసాయు లగు నామరూపములతో
మా కేల!

శ్రీకృ :—(చిరునవ్వున) శరీరమాత్ర వ్యవహారమునకే.

అర్జు :—సర్వనామములును వాసుదేవ పరవాచ్యములే కదా!

బల :—ఆర్యమిత్రుల పాదరేణువులచే నిరంతర పవిత్రభావము
వహించుచున్న పృథ్వి యెయ్యది!

అర్జు :—

తీర్థయాత్రయ జీవితోద్దిష్టపథము
క్షేత్రలాభమె సర్వార్థసిద్దిగాఁగఁ
దిరుగుచున్న మా యావాస మెఱుఁగనగునె
సర్వ సర్వంసహా మహాచక్రమందు!

శ్రీకృ:— మీ నివాస మేదియైనను మా యావాసముమాత్రము నేఁడు చరితార్థమైనట్లే.

అర్జు :—దేవా!

గోచరాగోచరంబైన గూఢవస్తు
సిద్ధికన్వహము తపస్సుచేసికొనుచు
నామ రూప విభజన కనర్హ్మదశను
జెందు మా కీఁక సమకూరు సిద్ధియొక్కఁడు.

యోగీశ్వరేశ్వరుల నాశ్రయించిన మా దృశుల కీ విషయము నిస్సందేహమే.

శ్రీకృ :—దాని కన్నగారు బాధ్యులు.

బల :—ఈమాసము ద్వారవతికి శరదుత్సవ సమయము. ఈ కళ్యాణసమయ మంతయు రాజన్యుల యధివాసపూతము కావలెను.

అర్జు :—అవశ్యము. ఈ మాసమంతయు నిట నుండుటకే నిశ్చయించి వచ్చితిని.

శ్రీకృ :—ప్రయోజన మడుగవచ్చునా ?

అర్జు:—ప్రస్తుతాశ్రమానుసారము మే మొక దుస్తరవ్రతదీక్షితు లము. ఆవ్రతము నిష్ప్రత్యూహముగ నిర్వహింపఁబడుట కన్యులసహాయమును గా సామర్థ్యములేమి నూహించి మి మ్మర్థించి వచ్చితిమి.

శ్రీకృ :—నిజ మారసినచో నిట్టి సందర్భములు మేము మి మ్మర్థింప వలసినది.

అర్జు :—(చిగునగవున) ఇది విజయసూచకము. (బలరామునితో) పరమార్థసాధక మగు నా యీ వ్రతము మీకుఁ గొంత కష్టమే కలిగించు నేమో ?

శ్రీకృ :—భవాదృశులు పరమార్థములే సంకల్పింతు రనుట వేఱచెప్పవలెనా ?

అర్జు :—ఐనను బరములేని యిహమునవలెనే పరమార్థ మిహలోక స్థితిలేనిది కాదుగదా ! సన్మార్గగామియగు నైహికసిద్ధియే పరమార్థసాధకమగును. కనుక నావ్రతమునకుఁ గొంత యైహికమగు విధానసామగ్రి యావశ్యకమై యున్నది.

శ్రీకృ:—అది మీ మాటమీఁద నీవఱకే సమకూర్పఁబడియుండె డిది. ఇందు మీకు సర్వము హస్తగతమే.

అర్జు :—(నిట్టూర్చి) కష్టతరము. ఈ వ్రతకాలమందంతయు నే నెప్పు డెందు సంచరింతునో నాకే తెలియదు. కాని యీపట్టణ ద్వారములు కొన్నికాలముల మాత్రమే యపావృతము లని విందుము.

బల :—దాని కేమి? వెంటనే యనుకూలింపఁజేసెదను. (నేపథ్యము చూచి) సేవకా!

సేవ :—(ప్రవేశించి) చిత్తము.

బల :— దక్షిణద్వార మీమాసమంతయు నార్యుల సౌకర్యార్థ మహోరాత్రములు తెఱచియే యుండవలెనని దౌవారికునకుఁ నా యాజ్ఞను దెల్పుము.

సేవ :—చిత్తము.

అర్జు :—మే మొక వివిక్తసౌధమున నుండవలయును. మాకుఁ బుష్పఫలాదులు సమకూర్చు సన్నిహితులుదక్క, దక్కిన యెవ్వరును మన సౌధ సవిధభూమికి రారాదు.

బల :—స్వామీ! అది యెంతటిపని?

అర్జు :—మాది యొక రాజయోగవిధానము. ఒక తేరును, గుఱ్ఱములును మావశములో నుండవలయును. మా కెప్పుడు విహారము పోవలయునని తోఁచునో యప్పుడు పోదుము. మ మ్మెవ్వరు నడ్డుపెట్టరాదు.

బల :—అవు నిట్టిదొక రాజయోగమార్గము కల దని విన్నాను.

అర్జు :—అవును. దానినే సమాచరించుచున్నాము. ఇవన్నియు మీ కనుకూలమైనచో నే నిందుండఁగలను. లేనిచో వెడలి పోవుదును.

శ్రీకృ :—అయ్యా! రాకరాక తమవంటివా రాప్తబంధువులుగా మా యింటికివచ్చి యోగానుభూతి లేకుండఁ బోవుట మాకు శుభముకాదు. మీ రిచ్చటనే యుండవలయును.

అర్జు :—అన్నిటికంటె మఱియొక దుర్ఘటమైన యంశమున్నది. అది యిందు సాధ్యమగునో కాదో తెలియదు.

శ్రీకృ :—స్వామీ! మీవంటి మహానుభావులకు సాధ్యము కానిది యేమున్నది! నేను మీకు విధేయుఁడను. మీకు సర్వ మును సాధ్యమే.

బల :—అది యేది యైననుసరియే తెలుపుఁడు.

అర్జు :—(చిరునవ్వున)

పైకి నైహిక సంబంధబంధ మున్న
యట్లు కనుపించు నెల్లరు హాస్య మాడఁ
దత్వముఁ జేసి సిరిప్రతిక భజించి
దివ్య మాముష్మికమ్ము సంధించుచుండు

శ్రీకృ :—స్వామీ! రాజయోగమార్గమే యట్టిది. ఇదివఱ కెంత మంది యతులు వచ్చినను, దమవంటి రాజయోగులు రాలేదు. అది యేదో తెల్పినచో నన్నగారు తప్పక సమకూర్తురు.

అర్జు :—ఈ నెలనాళ్ళను సహజసంస్కృతులు నమాయిక ముగ్ధహృదయులు, ఆవిర్భవన్నవకమల ముకుళమువలె నాజన్మపూతభావమువారగు నెలఁబ్రాయఁపు రాచపుట్టువులొకరు మాకుఁ బుష్పఫలాదులు కొనితేవలెను. మా పూజాద్రవ్యము లన్యులు తాకరాదు. చెట్లనుండియుఁ బూవులింకెవ్వరును కోయరాదు; తాకనురాదు. ఆయొకరే కోసి తేవలెను. ఆ వ్యక్తికి మేము కొన్ని నియమము లుపదేశింతుము. ఈ విషయమున నాభిజాత్యసిద్ధి కలవారు లభింపనిచో నట్టి పరిచర్య దుర్ఘటము.

బల :—(ఆలోచించును)

శ్రీకృ :—స్త్రీ పురుషులలో నెవ్వరైనసరియా!

అర్జు :—(సమ్మతిగాఁ దలయూచును)

బల :—(హర్షమున) స్వామీ! అట్లైనచో మా చెలియలు సుభద్ర యున్నది. మీరు చెప్పిన సర్వలక్షణములు కలది.

అర్జు: —అవును. కన్యలు నట్టివారలే.

బల :—అదృష్టవశమున నామె యింతవఱకు నవివాహితయే.

శ్రీకృ :—అన్నా!

బల :—ఏమి నీ సందేహము! ఆమెను గురుయువరాజున కిచ్చుటకు నిశ్చయించితి మనియా?

శ్రీకృ :—అవును.

బల:— వివాహము కాలేదుకదా!

శ్రీకృ :—నిజమే! పైన నామె కురుయువరాజును వరించను లేదు!

అర్జు:— మా కప్పు డభ్యంతరము లేదు. ఆమె యెవరినేని వరించినచో మాకు నిజముగా నభ్యంతరమే!

బల :—స్వామీ! నిజముగా నట్లు జరుగలేదు.

అర్జు :—నాకు మున్నే తెలియును. ఎట్లన?

ఎవరి పూజామహాఫలం బెట్టు లుండు
దాని కనుగుణమగుసిద్ధి దరిసివచ్చు
నంబుధినిగాక చంద్రోదయంబు లేదు
భవకపర్దము వీడి జాహ్నవియు లేదు.

---

# చతుర్థాంకము

( ప్రవేశము - పుష్పాపచయము నొనరించుచున్న సుభద్ర, మందారిక )

మందా :—అమ్మా! పూవులు నే నేల కోయరాదు!

( కోకిల కూజితము వినఁబడును )

మందా :—శరత్కాలమునఁగూడ నీ కోకిల కూఁజితమేమమ్మా!

సుభ :—అవును! కోయిలలు మధుకాలముననే కూయును. అయినను గొన్ని చెదఱుకోయిలలకాలమున నెటనుండియో యెగిరి వచ్చుచుండును. వాని కూజితము లివి.

మందా :—ఈ కూజితములయందుఁగూడ మన్మథోద్దీపన గుణముండునా?

సుభ :—కూత కోయిలదైనప్పుడు గుణ మెచ్చటికిఁ బోవును! కాని యకాలమునఁ దగ్గియుండవచ్చును.

మందా :—మఱి నిన్నది యించుకంతయుఁ గదల్చినట్లు లేదే!

సుభ :—(కోపమున) నీ విట్లనుటలో నీ తప్పేమియు లేదు. నీ కింత చన విచ్చిన నాదే దోషము!

మందా:—అవును లెమ్ము. నే నిప్పు డేది పలికిన ననుచితమే యగును.

( పూవులు గోయఁబోవును )

సుభ :—ఆ! నిలునిలు. నీ వీ పూలను దాకరాదు.

మందా :—కారణము?

సుభ :—రాజర్షుల యాజ్ఞ.

మందా :—ఇవి యేమి యాజ్ఞలో! విచిత్రముగ నున్నవి. మొదలీయనవగ్రత మేమో నా కంతు పట్టుటలేదు.

సుభ :—మహానుభావుల సంకల్పము లట్లే యుండును.

మందా :—అది నీకే తెలియవలెను.

సుభ :—ఏమైనను బూవులు నేనే కోయవలయు నఁట.

మందా :—తుమ్మెదలు వ్రాలినవిగూడఁ బనికిరావా?

సుభ :—ఈపూట నీ తెలివి మితిమీఱుచున్నది.

మందా:—నే నేమియు ననలేదే? నీ కేనో యర్థములు గోచరించుచున్నట్లున్నవి. ఆమార్పు నీలో నున్నది. నా తెలివిగాదు.

సుభ :—నీతో ననవసరముగా మాటలాడుటకు నాకిపుడు తీరిక లేదు.

మందా :—నీ కిదివఱకువలె నాతో మాటాడుటకుఁ దీరిక లేదు. అవును! అంతటి మహానుభావులకుఁ బరిచర్య చేయుచున్న పుడు పరిచారికలతో మాటలాడఁ దీరిక లేకుండుటలో వింత యేమున్నది?

సుభ :—నీ మాటలు నా కర్థ మగుట లేదు.

మందా :—నా మాట లర్థముకావలసిన యవసర మేమున్నది? ఎవరో చిత్రకారులు చిత్రపటములు తెచ్చిరి. నీవును బట్టి మహిషియు గుసగుస లాడుకొన్నారు. ఇంతలో రాజర్షి యెవరో వచ్చుట, అన్నగారు నిన్ను బరిచర్యకు నియమించుట జరిగినవి. ఇఁక నీవు మాటాడుటకు, మా మాట లర్థము చేసికొనుటకుఁ దీరిక యేది?

సుభ :—నీ మాట లిఁకఁ జాలింపవచ్చును.

మందా :—ఇంతకు నీ యతిథి చిత్రపటములోని వాఁడేనా?

సుభ :—కావచ్చును, కాకపోవచ్చును. పోలిక లున్నవనిన మాత్రమున నొక్కరేయని నిర్ణయింపలేముగదా! ఒకరిని బోలిన వారింకొక రుండుట సహజము.

మందా :—మీ రందఱొకటియే. నాకు నీవు చెప్పెదువా?

సుభ :—అయ్యయ్యో! పూవులు గొనిపోవలసిన సమయము సమీపించినది. ఇఁకఁ బోవలెను.

మందా :—నామాట విను. పూలు తాకినచో నిలువఁగలిగిన స్థితి కాదు నీది.

సుభ :—సఖీ ! నే నిదివఱకే బాధపడుచుంటిని. ఇంకను బాధ పెట్టెదవేల ! యతి పరిచర్య చేయక తప్పదు. ఇది యన్నగారి యాజ్ఞ.

(నిష్క్రమించును)

ఇది ప్రవేశకము

(అర్జుని వసతి. అర్జునుఁడు ధ్యానమగ్నుఁడై యుండఁగాఁ సుభద్ర ప్రవేశము)

సుభ :—(స్వగతము) మందారిక నా మనస్సులోఁ జొచ్చి నా శరీరమునందు వ్యాపించినట్లు మాటాడినది. ఈ యతిని బూర్వము నేనుజూచినట్లున్నది. రుక్మిణీదేవి యిచ్చిన చిత్రములోని మూర్తికి, నీయన మూర్తికిఁ జాల సామ్యమున్నది. ఈయన యాయన యగునా ! అయినచో నాపెద్దన్నగారు దీని కేల యంగీకరింతురు ! మానిసినిఁబోలిన మానిసు లుందురు. (సమీపించి) స్వామీ! ఇవిగో పూజాపుష్పములు.

అర్జు :—(కనులు తెఱచి) అక్కడిదాన విక్కడి కెట్లువచ్చినావు !

సుభ :—ఎక్కడిదానను !

అర్జు :—పొఱబాటుపడితిని. నేను బూర్వ మొక రాజాంతఃపురమున నిల్లే యోగస్థితియందుండఁగా నీవంటికన్యక యొక్క తె

నాకుఁ బరిచర్యకై నియమింపఁబడినది. నేను గనులుమూసి కొనియుండఁగా నామె కనిపించినది. తెఱచినంతనే నీవు కనిపించితివి. ఆమెయే నీ వనుకొంటిని.

సుభ :—స్వామీ ! ఆమెకూడ నావలెనే యుండునా ?

అర్జు :—కొంతవఱకు నీవలెనే యుండును. కాని యామెసృష్టి వేఱు, నీ సృష్టి వేఱు.

సుభ :—స్వామీ ! మీరు యోగులుగదా !

అర్జు :—మ మ్మాక్షేపించుచున్నావా ?

సుభ :—నే నంతటిదాననా ?

అర్జు :—రాజయోగ లక్షణమే యిది. సామాన్యులకు మా యనుభవములు తెలియునవికావు. మా ప్రవర్తనయంతయు ననురక్తులైనవారి ప్రవర్తనవలెనే కనిపించును.

సుభ :—తమ సెలవైనచో నొక సంగతి యడుగవలయు నని యున్నది.

అర్జు :—నా సెలవెందులకు ? నీవు సాక్షాత్పరమేశ్వరుని చెల్లెలవు. ఆయనయందు మాకెంత గౌరవమో నీయందు నంత గౌరవము ; ఆ ప్రశ్న యేదియో యడుగుము.

సుభ :—(శంకించుచు) స్వామీ! మీరు కన్నుమూసినప్పు డా రాచకూఁతురు కనిపించుటయు లోకమున కనిపించునది యేనా!

అర్జు :—అనఁగా నీయుద్దేశ్యము మే మామెయం దనురక్తుల మనియా! అదికాదు రహస్యము. మే మామె హస్తరేఖ లను బరిశీలించితిమి. ఈ వేళ కామె కొక యోగము చెప్పితిమి, మేము చెప్పినట్లది జరుగుచున్నదా యని యామెను బ్రత్యక్షీకరించుకొంటిమి.

సుభ :—(పాదములమీఁద వ్రాలి) స్వామీ! మిమ్ము దురర్థము చేసికొన్న నన్ను మన్నింపుఁడు.

అర్జు :—నీవు మాపాదములమీఁద పడరాదు. నీ వట్లు చేసినచో నీవు తెచ్చు పూజాపుష్పములు మాకుఁ బరిగ్రాహ్యములు గావు.

సుభ :—స్వామీ! తమరియెడ నెట్లు ప్రవర్తించవలయునో నాకుఁ దెలియదు. కనుక నే నేది చేయఁగూడదో మొదట నాకుఁజెప్పి నన్ను దిద్దుకొన బ్రార్థన.

అర్జు :— మొదటిది మమ్మేవిషయమునందును సందేహించరాదు. మా ప్రవర్తన లోకదృష్టికి విపరీతముగా నున్నను ... ...

సుభ :—అవును. మహాత్ముల చెయిదము లట్లుండు నని మే మనుకొనవలయును.

అర్జు :—నీ పే రేమంటివి ? సుభద్ర యనియా ?

సుభ :—ఇంతలోనే మఱచిపోయితిరా ?

అర్జు :—మా మనస్సు మనస్సులో లేదు.

సుభ :—మీరు యోగీశ్వరులుగనుక మీ మనస్సు మీ యాత్మలో నుండును.

అర్జు :—ఆ యాత్మ మా కిపుడు ప్రత్యక్షము.

సుభ :—నే నింక సెలవు తీసికొందును.

అర్జు:—తీసికొనవచ్చును. కాని నీయందు మా యనుగ్రహ మొక రీతిగా నున్నది. మే మిందు నెలనాళ్ళుండ వచ్చును. కాదా రెణ్ణాళ్ళుండవచ్చును, రేపే వెడలవచ్చును. అది యంతయు మాసిద్ధిమీఁద నాధారపడియున్నది. నీవు ప్రతి దినము మాకుఁ బరిచర్య చేయుచుందువు. మాకు వేఱే పరిచర్య యేమియు నక్కఱలేదు. మాకుఁ బుష్పములు తెచ్చిపెట్టుట యొక్కటియే పరిచర్య. ఈసేవ యేనాఁటి కా నాఁటికే నీకు ఫలవంతము కావలయును. ప్రతిదినము నీ వొకకోరిక కోరుకొనుచుండుము. మేము దానిని నీ కనుగ్రహింతుము.

సుభ :—స్వామీ !

అర్జు :—కోరుము.

సుభ :—అదికాదు.

అర్జు :—ఏదైననుసరే.

సుభ :—నేను గోరఁదగిన దేదియు లేదు.

అర్జు :—అనుగ్రహించితిమి.

సుభ :—నే నేమియుఁ గోరకుండనే యె ట్లనుగ్రహించితిరి ?

అర్జు :—అన్ని కోరికలు నిండినప్పుడుకదా యేమియుఁ గోర
కుండునది ? ని వ్వ ట్లనుగ్రహించితిమి.

సుభ :—మఱి నాకోరిక మిగిలియే యున్నది.

అర్జు :—అది చెప్పుము తీర్చెదము.

సుభ :—నాకుఁగూడ హస్తరేఖలు చూచెదరా ?

అర్జు :—చేయి యిటు తెమ్ము.

సుభ :—(అందిచ్చును)

అర్జు :—(స్పర్శసుఖ మభినయించును)

దక్షిణోర్వీధరానిల తాడనములు
కళల విచ్చిన తమ్మిని గలఁతపెట్టఁ

గొలను కొలనెల్లఁ బులకలు చిలుకరించు
భ్రాంతి కల్గించు స్పర్శనాభ్రాంతి నాకు.

సుభ :—స్వామీ! నాయొడలు కంపమొందుచున్నది. నన్ను నే నెఱుఁగని స్థితిలో నున్నట్లున్నది.

అర్జు :—(స్వగతము) ఆహా! ఈమెకూడ నా యనుభూతినే పొందుచున్నది. (ప్రకాశము) సుభద్రా! ఏమియును లేదు. మా యాత్మశక్తి నీలోఁ బ్రవేశించి నిన్నట్లుచేయుచున్నది.

సుభ :—స్వామీ! నన్నుఁ బోనిండు, నాకు భయముగానున్నది.

(వెడలిపోవును)

అర్జు :—(చిరునగవున)

అరవిచ్చి విచ్చునపుడే
పరువము మాధురులు వగరువాసన తొలిగాఁ
దొరలును, వలపులు తొలుతన్
స్ఫురియించును భీతభీత సుందరములుగా.

# పంచమాంకము

( ప్రవేశము - మందారిక, వకుళ )

మందా :—వకుళా! ఏమిటే ఆ రహస్యం?

వకు:—నాకూ తెలియటంలేదు. ఆయన యతీ; ఈవిడ పరిచర్య. మళ్ళీచూస్తే ఆయన పేరుచెపుతే ఈవిడ ఒళ్ళు పులకరిస్తుంది. ఇంక ఆయినో! ఆవిడతప్ప మఱియెవ్వరూ పరిచర్య చేయుటానికి పనికిరారట!

మందా :—ఆవిడ లోపలికి వెళ్ళింతరవాత చాలాసేపుంటుంది చూశావా? పూలు, పళ్ళు యిచ్చింతరవాత ఆయిన్ని మనసారా ధ్యానించి నమస్కరించి మఱీ వస్తుందేమో! ఇంతకీ మనస్సుకి నచ్చిన యతి. ఏ మంటావు?

వకు :—ఆసంగతి మనకెందుకు? అన్నగార్లిద్దఱూ ఒప్పుకున్నారామె!

మందా :—చిన్నన్నగారొప్పుకుంటే ఒప్పుకున్నారు. ఏవిషయంలోనూ ఎవ్వరినీ సామాన్యంగా నమ్మనివారు పెద్దన్నగారు గూడా ఒప్పుకున్నారు. అది మఱీ విచిత్రం!

వసు :—అందులోనూ పెండ్లియాడొచ్చిన పిల్ల, ఒకయ్యచేతిలో పెడదా మనుకున్న పిల్ల !

మందా :—ఈసంగతి తెలిస్తే ఆ అయ్య చేసుకుంటాడా ?

వసు :—అదొకటి పెట్టకు పెటకం ! ఈసంగతి వాళ్ళకెవరైనా తెలియఁజేసేరు !

మందా :—ఇంకెవరోదాకా యెందుకు ? కనురెప్పలతో దీపాలార్పేదానివి నువ్వేచాలు.

వసు:—నీవు మాత్రం తక్కువదానవా? తడిగుడ్డలతో గొంతికలు కోస్తావు.

మందా :—సరే! నీవు దీపమార్పు! నే గొంతి కోస్తా.

వసు:—తరువాత మన యిద్దటి గొంతిక లేమౌతాయో చూడు.

మందా :—ఏమవుతయ్! మన గొంతుకలుగూడా కోతబడుతాయ్! కాని చీకట్లో కాదు. వెలుతుర్లో.

వసు :—అదిసరే! అదుగో మళ్ళీ సుభద్ర వెదుకుతున్న దాయన దగ్గఱికి. మన మిక్కడ నుంచుని మాట్లాడుతూంటే ఆవిడ కనుమానంగా ఉంది.

మందా :—అంటే అనుకున్నంతా చేస్తా వన్నమాట!

వసు :—నీకు చెయ్యాల నని ఉన్నదన్నమాట!

మందా :—ఆఁ!

వసు :—సరే పోదాం పద!

(ఇది ప్రవేశకము)

(ధ్యానాభినయము చేయుచు నర్జునుఁడు ప్రవేశము)

అర్జు :—నేఁ డింకను సుభద్ర రాలేదు. నాకు ధ్యానమే నిల్చుట లేదు. నాకు దేనిమీఁద ధ్యానము నిలుపవలయునో! నే నేకాంతముగా నున్నపుడు నాకు ధ్యేయమైన విషయమే లేనపుడు నాకు ధ్యానమే నిలుచుట లేదన్న మాటలో నర్థమేమి? నా ఆత్మను నేనే మోసగించుకొనుటయా? ఎవరైన నిచట నుండిరేమో! ఉన్నచో వారిని మోసగింపవలయు ననియా? ఇంకను సుభద్ర రాలేదు. శ్రీకృష్ణదేవుఁడు తెలియనివాఁడు కాఁడు. సుభద్ర నాకు దక్కవలయు ననియే యాయన యుద్దేశ్యము కావలయును. లేనిచో సుభద్ర నీ పనికి నియమించునా? ఆయన నిజముగానే నన్ను గుర్తుపట్ట లేదేమో! ఇది బంధుత్వములో ద్రోహము చేసినట్లగుఁగదా! భగవంతుఁడు ప్రసాదించుచున్నది గ్రహించుటయు ద్రోహ మెట్లగును? వారు బంధుత్వములో నన్ను ద్రోహము చేయలేదా? నే నుండఁగా సుభద్రను గురుయువరాజున కెట్లిత్తు మనుకొన్నారు? సుభద్ర హృదయ మెఱిఁగినచో నిది యామెకు ద్రోహము

కాదా? కౌరవులకు రాజ్య మున్నదని, మాకు లేదనియా? ఆ ద్రోహమునకుఁ బ్రతిక్రియగా నీ ద్రోహ మున్నది. (నిట్టూర్చి) నేను వారికిఁ జేయఁగల ద్రోహమెంత? నా కీ మన్మథుఁడు చేయుచున్న ద్రోహమే పట్టరానిదిగా నున్నది.

చీమ చిటుకన్న మట్టెల చిట్టిరవళి
యాకు కదలిన ముగ్ధకటాక్ష లహరి
గాలి తెఱ సాఁగ పయ్యెద కదలుబాటు
వితతము ప్రతీక్షమూర్తి కట్టితిని నేను

నా కీ మన్మథవ్యాపార మనుభూతవిషయమే. పాప మా బాలిక కననుభూతము. ఆమె యెంత బేలయగు చున్నదో!

ఆ యులూపి నన్ను నపహరించుకపోయె
నెడఁదలోఁతు లెల్ల నెఱిఁగినామె
ఈమె సాహసమ్ము నెఱుఁగదో ప్రేమ లో
తెఱుఁగదో లతాంగి యింత బేల!

ఓయి యర్జునుఁడా! నీవు మంచి సందిగ్ధావస్థలోఁ బడితివి. ఆమె ముద్దరాలితనములోని వెఱఁగుపాటు వలపుగాఁ బరిగణించి బండితోలితివా, యామె బెదరినను దిగకుండఁ గూర్చున్నచోఁ జాలును. దిగి పరువెత్త నారంభించిన నా వెనుక యాదవసైన్య మున్నది. సాళ్వపౌండ్రక జరాసంధాది

సైన్యములను మాఱిముసఁగినది... ...అదెదో మట్టెలరవళి వినిపించుచున్నది.

మరుఁడు నవలతాంత శరమును విడచిన
శరము లోని తేటి మొఱసినట్లు
స్వాదుతావధిగఁ బ్రసన్నరసావర్త
మాకసంపుఁ దరఁగ లవఘళించు.

ఓహో! నేను ధ్యానము నభినయించవలయును. ఆహా! ఈ యభినయముగూడఁ గష్టతరముగానున్నదే! నాకనులు నామాట వినునట్లులేవు. ప్రత్యాలీఢపాదము నెఱుఁగుదును గాని పద్మాసన మెఱుఁగను. ఈ పద్మాసనము వేసికొని కూర్చుండుటయే దుస్సాధముగానున్నది. అదిగో! గుప్పు మని నామీఁదకుఁ బ్రత్యగ్రాపచిత లతాంతపరిమళలహరి వీచుచున్నది.

ఈ నవ్యకుసుమ సౌరభ
మా నీరజనేత్ర మోహనాంగక జలజాం
తానూన సహజ పరిమళ
మూని పిరిగొనుచుఁ గలంచు నొక చిఱుచఋకై.

ఈ మన్మథ బాణములకును, యుద్ధరంగమున శత్రువులు ప్రయోగించు బాణములకు నెంత భేదమున్నది! శత్రు ప్రయుక్తమైన బాణము మేనఁదాకిన నెట్లుండునో నాకుఁ

దెలియదు. నా బాణములు వారి కెట్లుండునో ? ఈ మన్మథ బాణములు నా కెట్లుండెనో యని వారికట్లుండు నను కొందును. ఛీఛీ ! అట్లుండునా ? రంభాద్యప్సరస్త్రీలు సామాన్యలు. సుభద్రియో.

( ప్రివేశము - సుభద్ర )

సుభ :—(స్వగతము) యతీశ్వరులు ధ్యాననిమగ్నులైన ట్లున్నారు. నాసందేహ మీనాఁడడిగెదను. ఆ చిత్రపటము మా బావదైనచో నీయన యాయనయే యైయుండును. ఈయన యాయనయైనచో నిట్లు రావలసిన యవసర మేమియుఁ గనుపించదు. నన్నర్థించినచో మాయన్న లీయరా ! అంత మహావీరుఁడైన మా బావను మా యన్నలు కాదందురా ? మా చిన్నన్న తప్పకుండ యంగీకరించును. ఖాండవవన దహనమునందు వానికి సారథ్యముచేసిన మాయన్న మా బావను గాదనఁడు. వారు వచ్చి యడుగలేదని మావారికిఁ బట్టుదల కావచ్చును. మేము పిల్లనిత్తుమని పోయి యడుగవలయునుగాని, మాకుఁ బిల్ల నిమ్మని యడుగుదురా ? ఎందు కడుగరాదు ? ప్రేమ గలిగినచో నడుగవచ్చును. అయ్యో! ప్రేమ. (సమీపించి) స్వామీ !

అర్జు :—(కనులు తెఱచి) అమ్మాయీ ! మేము ధ్యానమగ్నులమై యున్నప్పుడు నీవు మమ్ము బలుకరించరాదు.

సుభ :—క్షమించవలెను.

అర్జు :—మించిపోయిన దేమియును లేదు. పూవులు తెచ్చితివా?

సుభ :—స్వామీ! తెచ్చితిని.

అర్జు :—నీ పే రేమి?

సుభ :—స్వామీ! ఎన్నిసార్లు చెప్పినను మఱచిపోయెదరు. నా పేరు మఱచిపోయెడువారు నన్నెట్లు గుర్తుపట్టఁగలరు?

అర్జు :—మాకు నీమీఁద నున్నంత నీ పేరుమీఁద లేదు.

సుభ :—స్వామీ! అట్లే కానిండు. నా కదియే కృతార్థత.

అర్జు :—అమ్మాయీ! యెచ్చటనైనను బూవులు చల్లఁగా నుండును. నీవు తెచ్చెడిపూవులు వెచ్చఁగా నుండు నేమి?

సుభ:—స్వామీ! సరిగ నాకుఁగూడ నట్లే యున్నవి.

అర్జు:—నీకుఁగూడ నట్లే యున్నవా?

అది యెదో వెఱ్ఱిగాలి వనాంతరమున
వీచుచున్నది కాఁబోలు వెలఁది నీవు
వనములోనికిఁ బోకు వే వాడిపోయె
దవు లతాతన్వి! పొన్నారి చివురువోలె.

సుభ :—స్వామీ! మీ రింత శృంగారముగాఁ బ్రసంగింతు రని యనుకొనలేదు.

అర్జు:— మేము యోగులమే కాని లోకతంత్ర ప్రవృత్తి యెఱింగిన యోగులము.

సుభ:—స్వామీ! అందుకనియే మి మ్మొక్కటి కోరవలయు నని యనుకొనుచుంటిని.

అర్జు:—నిస్సందేహముగ నడుగవచ్చును.

సుభ:—స్వామీ! మీ రెప్పుడైన నింద్రప్రస్థనగరము వెళ్ళి నారా?

అర్జు:—సుందరీ! మా కా పూర్వాశ్రమపు మాటలు జ్ఞాపకము చేయకుము.

సుభ:—స్వామీ! క్షమింపుఁడు, ఇవిగో పూవులు, పండ్లు.

అర్జు:—అంతలోననే యిట్లైతివేమి? మీ కక్కడ బంధువు లెవ రైన నున్నారా యేమి? అన్నట్లుగాఁ బాండవులు, మీరు దగ్గఱ బంధువులుగదా!

సుభ:—నేను నర్జునుఁడును మేనత్త మేనమామ బిడ్డలము.

అర్జు:—ధర్మరాజును నీవును గారా?

సుభ:—(లజ్జాభినయము)

అర్జు:—అయినచోఁ దెలిసినది. నీ వతనిని గుఱించి యేమైన నడుగఁ దలంచుకొనినావా?

సుభ :—స్వామీ! ఆయనను మీరెఱుఁగుదురా?

అర్జు :—మే మీ యాశ్రమస్వీకారము చేయకముందు మేమును ధనుర్విద్య నేర్చినవారమే. ధనుర్విద్యలో నేనెంతటివాఁడనో యాయన యంతవాఁడు. స్పర్ధా యుద్ధములలోఁ గర్ణుఁడు మా యిద్దఱకే లొంగిపోయెడివాఁడు.

సుభ :—మీ రంతటివారని మీ భుజాకిణములే సాక్ష్యమిచ్చు చున్నవి.

అర్జు :—సుభద్రా! యెంత దాచుకొందమన్నను గొన్ని దాఁగవుగదా! మనోవికారములు దాచుటకుఁ బ్రయత్న మైనఁ జేయవచ్చునుగాని శరీరగత చిహ్నములు దాచు కొనుట సాధ్యము కాదు.

సుభ :—మీరు యోగీశ్వరులు. మనస్సును జయించినవారు.

అర్జు :—సుందరీ! మేము జయింపఁజాలని శత్రువులేదు. మేము జయింపఁజాలని దొక్కటియే మిగిలియున్నది. దానికొఱకే యీ యతిగాఁ దిరుగుచున్నాను.

సుభ :—స్వామీ! అది యేది?

అర్జు :—

నాకు నెదుటఁ గన్పించుచున్నది గ్రహింపు
వీలుగాకున్న యిది దాని వెక్కసంపు
లోతెఱుంగక నాగుండెలోన సుడి పె
నంకువలుగాఁగఁ గలఁచుచున్నది లతాంగి!

సుభ :—స్వామీ! ఎదుటఁ గన్పించుటయేమి? గ్రహింప వీలుగాకపోవుట యేమి?

అర్జు :—ఇదియంతయు నొక యాత్మానుభూతి. ఇంతకు నీవర్జునుని గూర్చి యడుగఁదలఁచిన దేమి?

సుభ :—ఆయన యతివేషమునుబూని దేశాటనము చేయుచుండె నని విన్నాను. అది నిజమేనా?

అర్జు :—నీతో నొక పరాచికమాడవలె ననిపించుచున్నది. ఆ యర్జునుఁడును నేనును గవలపిల్లలవలె నుందు మని యింద్రప్రస్థములో నందురు. ఆయనయే నే నని కొంచెము సేపను కొన్నచోఁ దప్పేమి? పరాచిక మాడవచ్చును. నీ వా యర్జును నెఱుఁగుదువా?

సుభ:—చిన్నప్పు డెఱుఁగుదును. పెద్దయైనతరువాతఁ జూడలేదు.

అర్జు :—అందుచేత నీ విప్పు డర్జునునిజూచినచో గుర్తుపట్టలేవు.

సుభ :—గుర్తుపట్టఁగలను. ఆయన యతిరూపమున నున్న చిత్ర పటమును జూచితిని.

అర్జు :—అయినచో నీ విదివఱకే నన్ను గుర్తుపట్టితివన్నమాట.

సుభ :—అవును స్వామీ! మీ రాయనవలెనేయున్నారు.

అర్జు :—సుందరీ! ఈసృష్టి చాల విలక్షణమైనది. అతనిని నీవు మనసా వరించితివి. అతఁ డా వేళకు యతియైయున్నాఁడు.

సుభ :—ఇప్పుడాయన యెచ్చట నున్నాడు!

అర్జు :—అతని చెలికానిని నిన్న నే నీపట్టణమునఁ జూచినాను. అతఁడేమైనాఁడో తెలియదు. ఆయనకూడ నీ శరదుత్సవము లకు వచ్చుననుకొన్నాను. నీవాయనను వరించితివి. నిన్ను గురుయువరాజున కిత్తు మనుకొనుచున్నారు. అన్యలగ్న మనస్కవైన నిన్ను బెండ్లాడి యా కురురా జేమి సుఖ పడఁగలఁడు!

సుభ :—స్వామీ! పెండ్లాడినతరువాతగదా సుఖపడుటయో పడకుండుటయో.

అర్జు :—పెండ్లియే జఱుగ దందువా!

సుభ :—పెండ్లిపీటలమీఁద నైనను నేను వజ్రపు టుంగరము నూరుకొని ప్రాణములు వదలుదాననే!

అర్జు:—అతనిమీఁద నీ కింత ప్రేమయున్న దని యర్జునునికి దెలియునా ?

సుభ:—ఆయనకుఁ దెలియదు.

అర్జు:—మఱి వార్తపంపించక పోయితివా ?

సుభ:—లోకేశ్వరియైన మా రుక్మిణీదేవిగారికే యప్రతిష్ఠ తప్ప లేదు; నా కెందుకు ?

అర్జు:—మఱి న న్నేమిచేయుమందువు ?

సుభ:—నా యీ సంగతి మా బావతోఁజెప్పి నన్ను రక్షింపు మని చెప్పవలయును.

అర్జు:—మీ వదినెగారిని మీ యన్నగారు రాక్షసవివాహమునఁ దెచ్చినాఁడు. నిన్నట్లే తీసికొని పొమ్మందువా?

సుభ:—స్వామీ! ఆ మహావీరున కెట్లభిమతమో యట్లు చేయ వచ్చును. నే నందులకు సిద్ధము.

అర్జు:—మఱి యింకొకసంగతి చూచితివా ? కృష్ణబలరామ సాత్యకి కృతవర్మ ప్రభృతులు వెంటఁబడి తరుముదురు. రుక్మియు, శిశుపాలుఁడును మొదలైన యల్పులుకారు. శ్రీకృష్ణదేవుని జయించుట కష్టముకదా !

సుభ:—మా బావవచ్చి తీసికొనివెళ్ళినచో మా చిన్నన్న యేమియు మాటాడఁడు.

అర్జు :—అట్లే యనుకొందము. తక్కినవారిమాట యేమి ?

సుభ:—ఖాండవవనము దహించిన మా బావ కీ పని యొక లెక్కగాదు.

అర్జు :—సుందరీ ! ఇది చాలకష్టమైన పని.

సారథిలేడు, రథ్యములు సాగఁగఁ జూచుకొనంగ శత్రుసంహారముసేయఁ దానొకరుఁడౌఁజుమి క్రీడి; మఱిగ గర్ణ ద్వివ ద్వారము వెనకనుండి తనపైఁబడు; వెనక శరప్రయోగముల్ సూరెలయందు గుఱ్ఱములఁజూచుటయుం గడు కష్టమయ్యెడున్.

సుభ :—స్వామీ ! రథసారథ్యముచేయుటలో నేను మాయన్నగారి యంతటిదానను. కాని రథమును, రథ్యములును లేవు.

అర్జు :—అవియు నున్నవే మామకూఁతురా !

గుఱ్ఱములు నీవుతోలిన
నట్టాకలులేక యిట్లు యాదవులును పై
వట్టె కౌరవులట్టె
బిట్టబిగిసి వత్తు రేని విదలింతు నని.

(హస్తగ్రహణము చేయును.)

సుభ :—(భయభీత యగును)

అర్జు :—

వట్టులై పొంగివచ్చు శైవాలిని తొలి
యడ్డుదగ్గర నించుక యాగినట్లు
ప్రణయ భాగీరథీ! మేనబావ నంచుఁ
దెలిసినంతన నిట్లు భీతిల్లె దేల?

---

( మాండవ్యుఁడు, కాశ్యపుఁడు )

మాండ :—ఎవరు మీరు?

కాశ్య :—మాది యింద్రప్రస్థము. మేము చిత్రకారులము.

మాండ :—ఓహో! మీరా! మీ చిత్రము లెంతపనిచేసినవి!

కాశ్య :—ఎంతపనిచేసినవి?

మాండ :—నిజము యతిని సృష్టించుకొనినవికదా!

కాశ్య :—నే నేమి బ్రహ్మననుకొంటివా? సరికాని ఆ యతి యెవరో నీ చిత్రమున నుద్భవించి ద్వారకలో నంతిపురములఁ బ్రవేశించినాఁడటగా?

మాండ :—అవును. అందులో వింత యే మున్నది?

కాశ్య :—వింత యేమియులేదుకాని యా యతిలోఁగల చిత్ర మేమి?

మాండ:—భగవానులు కృష్ణబలరాములచేతఁగూడ సంభావింపఁ
బడుటయే !

కాశ్య :—అటులనా ?

మాండ :—అంతేకాదు. బలదేవులు సుభద్రనుగూడ నా
యతీంద్రుల పరిచర్యకు నియమించిరి.

కాశ్య :—సుభద్ర యెవరు ?

మాండ :—శ్రీకృష్ణభగవానుల చెలియలు.

కాశ్య :—అయినచో నా యతిచరిత్రము వింతగ నున్నది !

మాండ :—వింత యే మున్నది ? అది రాజయోగవిధానము.

కాశ్య :—ఆమెను గురుయువరాజున కీఁదలఁచితి రఁటకదా !

మాండ :—హృదయములు కలియుట ప్రధానము.

కాశ్య :—అయినచో యతిపరిచర్య యెట్లు చేయుచున్నది ?

మాండ :—హృదయములు కలసినవిగనుక.

కాశ్య :—హృదయములు కలియుటయా ? (ఆశ్చర్యము)

మాండ :—యోగి పరిపూర్ణుఁడు కానున్నాఁడు.

శాశ్య :—పరిచర్య యిట్టి యోగముగాఁ బరిణమించు టిదివఱ కెన్నఁడైన గలదా ?

మాండ :—స్నాతకవ్రతమునఁ దీర్ఘయాత్ర నవలంబించి తిరుగు యోగుల కెన్నఁడునుగలదు.

శాశ్య :—ఏమో నా కిది వింతగనే యున్నది.

మాండ :—నీవంటి మనస్సులతో నాలోచించు లోకమునకు వింతగనే యుండును. కాని జగదంబిక శుశ్రూష పరమ శివుని హృదయము నాకర్షింపలేదా ? అది యనాదినుండి శాశ్వతముగా సంభవించుచున్న యోగము. ఈ యోగానందమే ఆ రాజయోగులకు నిశ్చలసమాధి. దాని నెఱిఁగినవిమ్మటనే లోకమందంతటను దివ్యానుభూతి కాన్పించును. జగమంతయు ప్రేమ రసార్ణవములో నోలలాడుచుండును. దాని నెవ్వ రెట్లనుకొన్నను దిగులులేదు.

శాశ్య :—ఏమి యీ కోలాహలము ?

మాండ :—ఏమో చూతమురమ్ము. (నిష్క్రమి)

---

# షష్ఠాంకము

( ప్రవేశము - బలరాముఁడు, రథసారథి )

బల :—ని శ్చచ్చుట వదలిపెట్టిరి !

సార :—ఆర్యా! మననగరి బహిఃప్రదేశమునఁ గ్రోశముదూరమున వదలిపెట్టిరి.

బల :—సుభద్ర యిష్టపడియే వెళ్లెనా !

సార :—చిత్తము. ఆమెయే రథసారథ్యము చేయుచున్నారు.

బల :—ఓరీ! మేమెవ్వరమనిరా! యర్జునుఁ డీపనిచేసెను ? నాఁటి కజ్జుతో నింద్రప్రస్థము నెత్తి తలక్రిందులుగాఁ బడద్రోసె దను. మన సేనానాయకులకుఁ గబురంపుము.

సార :—ప్రభూ ! ఇంతపని యర్జునుఁడొక్కఁడును జేసియుండడు. మనపురములో వారి గూఢచారులెవ్వరో యుండియుండ వలయును.

(అంత బంధితుఁడై కౌశ్యపుఁడును, రాజభటుఁడును బ్రవేశింతురు)

బల :—వీఁ డెవ్వఁడు !

కాశ్య :—నేను బ్రాహ్మణుఁడను. ఈయూరికిఁ గ్రొత్తవాఁడను. ఎవరో యెవరినో తీసికొనిపోయినారఁట. నేను చిత్రపటము లమ్ముకొనుచుండఁగా నన్నితఁడు పట్టుకొనివచ్చినాఁడు.

బల :—నీవు బ్రాహ్మణుఁడవా! చిత్రపటము లమ్ముకొను చున్నావా! బ్రాహ్మణబ్రువుఁడు వన్నమాట!

కాశ్య :—చిత్తము.

బల :—(నవ్వి) వీఁడెవ్వఁడో అపండితుఁడు. వీనిని వదలిపెట్టుఁడు.

కాశ్య :—అయ్యా! ఎత్తుకొనిపోయిన దెవరు? ఎవరిని?

భటు :—ఆ సంగతి నీ కెందుకు పోవయ్యా!

కాశ్య :—అందుకుఁగాదయ్యా! శ్రీకృష్ణదేవుఁడును, సాత్యకియు నీ సంగతియే మాటాడుకొనుచున్నారు. వా రెవరో నాకుఁ దెలియలేదు.

బల :—వారు మాటాడుకొనుచుండఁగా నీ వక్కడ నెట్లుంటివి? కృష్ణునకుఁదెలియునా? అవును! అతఁ డెప్పుడును పాండవ పక్షపాతి - రాజ్య భోగాదులకు దూరులై దీనులైననుస రే!

కాశ్య :—అయ్యా! మాది హస్తినాపురము. యతి వేషముతో నున్న యర్జునుని బొమ్మ నేను చిత్రించితిని. దానిని శ్రీకృష్ణ స్వామి కొన్నారు. ప్రక్కనున్నవారితో దను చెల్లెలిగారి

కిది బహుమానముగాఁ బంపింతుమన్నారు. దానివెల తరువాత నిప్పింతుననఁగా నింతకుముందే వారి దర్శనము చేసితిని.

బల :—ఇదియంతయుఁ గృష్ణుఁడుచేసిన మాయయే.

కృష్ణుఁడు ప్రివేశించును. బలరాముఁడు మొగ మటు త్రిప్పుకొనును)

కృష్ణ :—అన్నగారికి నామీఁదఁ గోపముగానున్నట్లున్నది.

బల :—(కోపముతో) దుర్యోధనుఁడు పెండ్లికిఁ దరలివచ్చెను గదా! ఇప్పుడతనితో నేమని చెప్పవలయును!

కృష్ణ :—దుర్యోధనుఁ డిదివఱకే కోపమువచ్చి వెడలిపోయి నాఁడు.

బల :—కోప మెందుకు వచ్చినది!

కృష్ణ :—మన సుభద్ర యర్జుననినే ప్రేమించుచున్నదని, తనకిచ్చి పెండ్లిచేసినచో విషముపుచ్చుకొని చచ్చిపోవుదునన్నదనియు మన సుభద్ర చెలికత్తెలద్వారా నెట్లో తెలిసినదఁట.

బల :—సుభద్ర నిజముగా నట్లన్నదా!

కృష్ణ :—అవును క్రీడితో నిట్లు రాక్షసవివాహమున కంగీకరించుటయే దానికిఁ బ్రబలసాక్ష్యము.

బల :—మీారందఱు మీాయిష్టమువచ్చినట్లు చేసికొనుఁడు నాకు మీాతో నవసరము లేదు

కృష్ణ :—అన్నా ! మనకొక్క చెల్లెలు. ఆమెకుఁ బసుపుకుంకుమ మైన నీయవలదా ?

బల :—న న్నిప్పు డేమి చేయ మందువు?

కృష్ణ :—సుభద్రార్జునులను బిలిపించి వారికి మనమే యిక్కడ వివాహము చేయుదము.

బల :—వారీ పాటి కింద్రప్రస్థము చేరియేయుందురు, అన్నా! సుభద్ర యెంత పనిచేసెను? చిన్ననాఁటినుండి సుకుమార కుసుమమువలె ముద్దుగా బెంచిన తలి దండ్రులతోపాటు సోదరులనుగూడ నెట్లు విడచిపోయెనో!

( సుభద్రార్జునులు ప్రవేశము )

సుభ :—(బలరాముని పాదములపై వ్రాలి ఏడ్చును) కుసుమ మును పూజ్యుల కర్పించుటయేగదా పెంచిన ఫలము? సౌరభము ననుభవింపఁదగినవాని చేతిలోఁ బడుటయేకదా కావలసినది.

అర్జు :—బావగారికి నమస్కారములు.

బల :—నేను మీాకుఁ జేయఁదగిన దేమియును లేదు.

అర్జు :— బావగారూ! మీరు లోకేశ్వరులు. మీరు చేయఁదగి నదియే లేనిచోఁ దక్కినవారు చేయఁదగినదేమియు నుండనే యుండదు. మీరు నాకీ వరము దయచేయక తప్పదు.

మా శుభంబులుగోరి మాకు రక్షగా మీరు
తనియింతురుగాక బాంధవ్యగరిమ
గురులు దేశికులునై పొలసెడి దురితంబు
లెల్లఁబోఁదోలి రక్షింతురుగాక,
స్పర్శపూతములు మీ చరణారవిందముల్
మా ప్రాణముల భక్తి మలచుఁగాక
వర్ధిల్లుగావుత వసుమతీ విభవంబు
ఋతుశోభతో పెల్లి లినుమడింప

సిరియు వాణియు గిరిజయుఁ జేరినట్టి
యల త్రిమూర్తుల యోగవిఖ్యాతితోడ
పృథివి గోవుచు సస్యసంపదల బలిసి
ఘనపయస్సుల వర్షించి తనుపుఁగాక!

బల :— తథాస్తు.

శ్రీకృ :— తథాస్తు.

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 14 | — | (ఇదిస్థాపన |
| 3 | 6 | ఇక గాను | ఇఁకఁ గాను |
| | 16 | లెవరైన తను | లెవరైనఁ దను |
| 13 | 15 | బోవుచు బర | బోవుచుఁ బర |
| 15 | 11 | పైన పెట్టియుంచు | పైనఁ బెట్టియుంచు |
| 16 | 10 | నీయుడిట్లు | నీయుఁడిట్లు |
| 19 | 4 | ఇక చిత్ర | ఇఁకఁ జిత్ర |
| 26 | 11 | చిత్తము | చిత్తము (నిష్క్రమించును) |
| 27 | 14 | (చిరునవ్వున) | (చిరునవ్వున) ఈ రాజ యోగమార్గము కడు చిత్రమైనది |
| | 16 | కనువించు | కనుపించు |
| 27 | 2 | కనిపించునది | ఁగనుపించునది |
| | 11 | పడరాదు | ఁబడరాదు |
| | 16 | ప్రార్థన | ఁబ్రార్థన |
| 37 | 14 | (నభినయించును) | (నభినయించుచుఁ దనలో) |
| 39 | 6 | అయినో | ఆయనో |
| | 7 | చేయిటానికి | చేయటానికి |
| 40 | 1 | ఒకయ్యి | ఒకయ్య |
| | 3 | అయ్యి | అయ్య |
| 41 | 6 | నిలుప | నిలువ |
| | 12 | నాకుదక్క | నాకుఁదక్క |

| | | | |
|---|---|---|---|
| 42 | 17 | వెఱఁగుపాటు | వెఱఁగువాటు |
| 43 | 15 | జలజాం | జ లతాం |
| 44 | 5 | | (అర్జునుఁడు ధ్యానము నభినయించును) |
| 48 | 1 | గ్రహింపు | గ్రహింప |
| | 2 | యిది | యది |
| 52 | 5 | | (షష్టాంకము) |
| 54 | 16 | | (ఇది విష్కంభము) |
| 55 | 1 | వ. ష్టాంకము | — |
| 56 | 5 | బృవుఁడు | బృవుఁడ |
| | 18 | చెల్లెలి | చెల్లెలు |
| 58 | 7 | వివాహమ | వివాహము |
| | 8 | ప్రిష్ఠము | ప్రిస్థము |
| 59 | 4 | రక్షగా | రక్షగ |